


# [illegible]తాంజలి

ఖండకావ్యము






రచయిత

వేముగంటి నరసింహాచార్యులు

1950

# కవితాంజలి

ఈ పుస్తకమును సభ
కే సమర్పిస్తున్నది.




రచయిత:

వేముగంటి నరసింహాచార్యులు

వెల 8 అణాలు.

# తొలి పలుకు



భాషాభిమానులారా !

నేను యిదివరలో "ప్రబోధము" మఱియు "అమరజీవి బాపూజీ" అను రెండు గ్రంథములను రచించి ఆంధ్రలోకమునకు అందించినాను. అట్టి రెండు పొత్తములు తెలుఁగువారి మన్ననల కెంతవరకు పాత్రములైనవో తెలియదు. ఇప్పుడు "కవితాంజలి" యను ఖండకావ్యమును ఆంధ్ర సోదరుల తోడ్పాటున వెలువరించి తెలుఁగుతల్లి చరణపీఠముముందిడినాను. ఈ ఖండకావ్యములోని కొన్ని పద్యములు కాకతీయ, గోలకొండ వారపత్రికలలో ప్రకటింపబడినవి. మఱికొన్ని పద్యములు సభలయందు చదువబడినవి. నా "కవితాంజలి" ఆంధ్రసోదరుల కాదరపాత్రమై ఆంధ్రమాత పూజాపుష్పాంజలియై అలరగలదని ఆశించుచున్నాను. ఈగ్రంథముద్రణకైసహాయ మొనర్చిన మిత్రరత్నములకు నా కృతజ్ఞత. మఱియు నేనడిగినంతనే గ్రంథ ముద్రణకు అధికముగా ధనసహాయ మొనరించిన శ్రీయుత మిట్టపల్లి హనుమంతరావు దేశముఖుగారికి పరమేశ్వరి ఆయురారోగ్యైశ్వర్యము లొసగి రక్షించుగాత!.

నా కవితను విని దయతో అభిప్రాయమిచ్చి భావ్యభివృద్ధికి ప్రోత్సాహ మొసగిన శ్రీ విఠాల చంద్రమౌళిశాస్త్రి గారికి, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారికి, రాళ్ళబండి రాఘవశాస్త్రిగారికి నా ధన్యవాదములు.

ఇట్లు
వేముగంటి నరసింహాచార్యులు, సిద్దిపేట.

# కృ త జ్ఞ త

ఉ॥ నావినుపించు పద్యరచనన్ గడు శ్రద్ధగ నాలకించి యా
యా విషయానికిన్ దగినయట్లు మనోహరమైన శైలి వా
క్యావళి వ్రాసియిచ్చి సదయాత్మకుడై యొకకొన్నికబ్బపుం
ద్రోవల లక్షణంబులు నిరూపణతో నెఱిఁగించె నెంతయున్.

ఉ॥ తీయని భావముల్ మృదుల దివ్యపదంబులు గల్గునీదు రా
మాయణ కల్పవృక్షకుసుమంబులు సౌరభముల్ వెలార్చి
యా
హా! యనుపించె నాంధ్రసుజనావళినిన్ దనియించి, సత్యనా
రాయణ విశ్వనాథకవిరత్నము! నీకునమః కృతజ్ఞతల్.

---

# న మ స్సు

ఉ॥ హాయని వేడ్కనారచిత పద్యములన్ విని కూర్మితో నభి
ప్రాయ మొసంగుచున్ గవనభావ్యభివృద్ధికి దోహదంబుగా
దీయని తేనెపల్కులను దీవెనలిచ్చిన చంద్రమౌళి శా
స్త్రీ! యతిభక్తిమిమ్ముల భజించెద నే కవితానమస్కృతిన్ :

మ॥ చెలువుంజిమ్మెడు లేఁత ప్రాయపుఁ బసన్ జిన్నారిపొన్నారిప
ల్కులఁ గుల్కించెడు మామకీనకవితా లోలాక్షి మీవంటిపె
ద్దల యాశీస్సులనంది భావరసశబ్దస్ఫూర్తి శోభిల్ల వ
ర్ధిలు త్తన్ ముందిక చంద్రమౌళి కవిమౌళీ! పండితగ్రామణీ!

గ్రంథకర్త

# ★ పండితాభిప్రాయములు ★



శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్య సుకవిచే రచింపఁబడిన యీ "కవితాంజలి"ని చాలవరకు చూచితిని. నిర్దోష మృదుమధుర శయ్యాసముల్లసిత మీకవివరుని రచనా నైపుణి యనుట కెంతమాత్రము సందియము లేదు.

వయస్సునఁ జిన్నవాడయ్యు నవనాగరిక హృదయాహ్లాదకరముగ "ప్రబోధము" "అమరజీవి బాపూజీ" అను పేర్లతో నొప్పారు పొత్తములను రచించి యింతకుమున్నె పేరుగొన్నవాఁడగుటచే నెంతయు మోదావహము.

ఇక ముందు హేయగుణరహితానంత కల్యాణగుణాకరుఁడగు శ్రీరమాసనాథుని సచ్చరిత్రముల వర్ణించి తన వాఙ్మయమునకు శాశ్వతానందఫలమును సంపాదించుకొనుగాతయని కూడ కోరుచున్నాను. మఱియు సంస్కృతమునగాని యాంధ్రమునగాని భాషాపదముల యల్లిక యల్లారుముద్దు సొబగుఁజూరఁగొనుచున్నది. ఈ కవితాంజలిలోనే వనవాసము, సావిత్రి అను శీర్షికలలోఁగల చరిత్ర నిర్మాణ కుశలతాలత కరుణారస పరిమళమిళల్లాలిత్య విశిష్టయగుట సహృదయ హృదయ రంజకమని సంతసించి ఇకముందును యెట్లు కవితాసారస్యమును సంపాదించుకొనెనో అట్లే వినయవిధేయతాది సద్గుణములను గూడ సంపాదించుకొనుగాతయని విరమించుచున్నాను.

ఇట్లు

**విఠాల చంద్రమౌళి శాస్త్రి**

శతావధాని గజవెల్లి.

తెలంగాణ కవిరత్నములలో నొకరగు శ్రీమాన్ వేము గంటి నరసింహాచార్యులుగారు వారి "కవితాంజలి" యను ఖండకావ్యమును చాలభాగము వినిపించినారు. వీరి కవితలో సాఫీయైన పద్యరచన, మధురమైన శైలి, ఆధునికభావములు, దేశభక్తి, కృషీవలుని కష్టాలు, స్వార్థపరుల దుర్వృత్తి మొదలైనవి వస్తువులు. పద్యరచన కొన్నిచోట్ల చాలపేశలముగా నున్నది. వీరికిఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములొసంగి యితోధిక కవితాశక్తి నిచ్చుగాక !

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ
భాగ్యనగరము—13-6-50.



మహాశయా !

తమ కవితాంజలిని దిలకించితిని. నూతన భావములును, నిరర్గళశైలియు, చక్కని తెలుగు నుడికారములుంగలిగి, శోభిల్లుచున్నది. ఆంధ్రభారతింబూజింప, నామోదప్రదములగు పద్యసుమముల నంజలింగీలించి యర్పించుచున్నట్లు, మీ రొనర్చిన ఈ ఖండకావ్యమునకు నామకరణమొనర్చుట శ్లాఘనీయము. చదువఁజదువ రసముప్పతిల్ల రచించిన పద్యములు సారస్వత సేవాపరులగు సరసుల నెంతేని సంతసింపజేయుననుటకు సందియము లేదు. భగవదనుగ్రహమున నితోధికముగ వాఙ్మయమునఁ గృషిసల్పి ఆంధ్రభారతి నుపాసించి యశమునార్జింతురుగాత.

ఇట్లు
రాళ్లబండి రాఘవశర్మ

# భారతమాత

శా॥ పాణిన్ బంగరు పూఁగలంబుఁగొని విద్వాంసుల్ కవిగ్రామ
(ణుల్
రాణింపుంగవితాప్రసూనముల నారాధింపగా, వేడ్కబ
ల్గాణల్ నీశుభకీర్తిగీతికలనాలాపింపగా, నష్ట దిగ్మణీ!
జ్యామణిశ్యాంచితవేదిపై వెలయుమమ్మా! భారతాంబా

సీ॥ కనిపెంచినావు శాంఁ గల భాగ్య సౌధ ని
ర్మాతలన్ సత్పాత్ర రత్నములను
నోచుకొన్నావు కన్నులలో దయా సుధ
జాలువారఁగ నహింసావ్రతంబు
ప్రసవించినావు నీ పసిఁడి గర్భంబున
మేలైన కులుకు వజ్రాల గనుల
వెదజల్లినావమ్మ! వెలుసీమలందు బం
ధుర కీర్తి కర్పూర పరిమళంబు
తే-గీ॥ బాపుకొన్నావు పర దాస్య బంధనములఁ
గాంచినావు స్వాతంత్ర్య సౌఖ్యంబు నేఁడు
శాంతిదాయినీ! మంగళా చారగమని!
ప్రణుతి శతములు నీకు శ్రీ భరతజనని!.

శా॥ బంగారంబునఁ గొంగు నింపుకొనునో భాగ్యాంబురాశీ!
(మహా
గంగా పాంగ! సుధాగళన్మధుర ముగ్ధస్నిగ్ధ భాషాముఖీ!
రంగద్వారిధి మేఖలా! భరతసామ్రాజ్ఞీమణీ! గుండెలు
ప్పొంగన్ నీచరణాబ్జ పీఠమును సంపూజింతునశ్రాంతమున్.

సీ॥ భువనప్రశస్తమౌ పుణ్య గంగానదీ
సలిలపూరములందు జలకమాడి
పసుపు నిగ్గుల జగ్గు లెసగఁ బండిన పంట
చేల సింగారంపుఁ జీరగట్టి
యఖిల విశ్వంబున కాదర్శకంబైన
విమలధర్మము కిరీటమును దాల్చి
ముద్దులుఁ గారెడు మువ్వన్నె ఝుండాలు
పూలదండలుగ కొప్పున ధరించి

తే-గీ॥ వర హిమాలయ వజ్ర దర్పణమునందుఁ
జూచుకొనవమ్మ! నీ భాగ్య శోభనంబుఁ
గ్రొత్త స్వాతంత్ర్య రమను గైకొన్న పుత్ర
వరుల నాశీర్వదింపుమా! భరతమాత!.



## తెలంగాణ

సీ॥ కాకతి సామ్రాజ్య కల్యాణి దిక్కులఁ
గీర్తి దీపములు వెల్గించునాఁడు
పోతన కవిరాజు పున్నెంపు వాగ్దేవి
తీయని కైతలం దించునాఁడు
రామదాసుని భక్తి రసకీర్తనలు ప్రతి
జీవినిఁ బులకింపఁ జేయునాఁడు
వేయి కంబాల గాంభీర్యంబులోఁ దెల్గు
శిల్ప వల్లికలుఁ బుష్పించునాఁడు

తే-గీ॥ గోలకొండ నవాబుల కోటలోన
నాంధ్ర మంత్రులు నధికార మందునాఁడు
గడన కెక్కిన మా తెలంగాణ భూమిఁ
దలఁచుకొని తల్చుకొని మేను పులకరించు.

సీ॥ ఇచ్చోటఁ బగవారి వెచ్చు నెత్తుటితోడఁ
దిలకంబు దిద్దె మా తెలుఁగు జోదు
యిచ్చోట తురకల కుచ్చితానికిఁ బ్రతి
సలిపి పేర్గాంచె మా తెలుఁగుమంత్రి
యిచ్చోట మగవార లేని సిగ్గిలునట్లు!
లలిరాజ్య మేలె మా తెలుఁగురాణి
యిట జీవ కళల నొల్కించు బొమ్మలఁ జెక్కి
నులినందుకొనియె మా తెలుఁగు శిల్పి

తే-గీ॥ యిది తెలంగాణ మండల మీధరిత్రి
పూర్వ వైభవాంశములను భువనమునకు
సరవి ఢంకా బజాయించి చాటివత్తు
ప్రియదమునఁ గన్నులందు బాష్పములు నిండ.



# నె హ్రూ

ఉ॥ అరువది వత్సరంబుల వయః పరిపాక సమంచితుండవై
వరలితి వాత్మబంధువుల భంగిఁ బ్రవర్తిలు భారతీయ సో
దర జనమాచరించెడు సుధామధుర స్తుతి వాఙ్నదీపరం
పరలను స్నానమాడి కనుమా! జవహారు! చిరాయు
రున్నతిన్.

ఉ॥ ఎండిన మోడు లేని చిగిరించెడు నీ కమనీయమైన వా
క్పాండితి కబ్బురం పడి యఖండ బహూకృతితో నమేరికా
ఖండము ప్రేమపూర్వకముగా నిను బ్రహ్మరథంబుఁ బట్టె ది
క్కాండముఁ జుట్టి వచ్చినవి కమ్మని నీశుభ కీర్తివాసనల్.

సీ॥ కన్నె గులాబి మొగ్గల నిగ్గుఁ గులుకు నీ
మధుర మూర్తికిని నమస్సు లొసఁగి
ధాత్రికెల్లను మార్గ దర్శకంబైన నీ
విజ్ఞాన మహిమకు బిరుదులిచ్చి
యమృత పూరమున నోలాడు నీ కమ్మని
వాణికి గగ్గురు పాటుఁగాంచి
భద్రతా సంఘ సభాస్థలిన్ బంగారు
గద్దెపైఁ గూర్చుండు గౌరవ మిడి
తే-గీ॥ అమెరికా కెనడాది రాజ్యముల జనము
ప్రేమ రసము నీపైఁ గురిపించినారు
గణన మించిన నీగొప్ప తనముఁ జూచి
యుబ్బి యుప్పొంగి పోవని యుర్వి లేదు.

మ॥ నయగారాజల పాత వేగమున నూత్న ఖ్యాతి నార్జించుచున్
జయమున్ గాంచితి? భారతీయుల ప్రతిష్ఠావల్లి పుష్పించి వి
స్మయసౌరభ్యముఁ బారజల్లినది బ్రహ్మాండంబునందో శుభో
దయ! నీకున్ బ్రణుతాంజలుల్ భరత నేతా! నెహ్రూ ధీ
మన్మణీ!.

తే-గీ॥ భరతమాతకు నోముల పంట ఫలము
భారతీయుల ముంగొంగు బంగరంబు
మా జవాహరు నాయక మండనుండు
షష్టిపూర్తి మహోత్సవ స్నాతుఁడయ్యె.



## ★ సా ను భూ తి ★

మ॥ వలపూరించెడు పెండ్లినాటి పసుపుం బారాణి సింగార పుం
గులుకున్ మాయకమున్నె నీపతికి నీకున్ శాశ్వతంబైన వీ
డ్కోలుపుం గూర్చిన దైవమెట్టి కఠినుండో! యక్కటా! యెట్టులన్
దెలవారంగలదింక నీ బ్రతుకు తన్వీ! గుండెనీరయ్యెడిన్.

మ॥ నొసటన్ గుంకుమ బొట్టు, కాళ్ళఁబసుపున్ దోరంపునున్నొప్పునన్
గుసుమంబుల్ ధరియించు భాగ్యమది నీకున్ లేదు లేదంచు ర
క్కసి సంఘంబు వితంతు బాలిక కయోగ్యంబంచు శాసించినన్
బసరంబున్ బలె నెంచుచున్నది దయా భావంబులెక్కింపకన్.

తే-గీ॥ ఇంపుదళ్కుకొత్తు నిండు నూ కేండ్లబ్రతుకు
అడవిఁగాసిన వెన్నెలగ్గాు కృశింప
నేవిధంబక్కటా! భరియింపఁ గలవు?
చెల్లెలా! నీచవైధవ్య జీవనంబు.

ఉ॥ "అమ్మ" యటంచు ముద్దుపలుకైన వచింపఁగలేని లేఁతప్రా
యమ్మున మూఁడుఁగాళ్ళ ముసలయ్యకునిన్ ముడివెట్టి యయ్యయో!
బొమ్మలయాట పెండ్లి విధమున్ బొనరించియుఁ దల్లిదండ్రులే
వమ్మొనరించినారు చెలువంబగు నీనవముగ్ధజీవికన్.

తే-గీ॥ కటుకుటుపవాసముల నిగ్గుఁ దరిగిపోవ
చిక్కిపోయెను నీమేను స్రుక్కి నేఁడు
నలుగుచుంటివి యకట! సనాతనంపు
ధర్మదేవత యినుప పాదాలక్రింద.



## ★ దురాశ ★

శా॥ ఆటంబాంబుల సృష్టితోఁ బ్రళయ ప్రారంభమున్ జేసి పో
రాటంబుల్ గలిగించుచున్ భువన సామ్రాజ్యమ్ము సాధించు నీ
యాటోపంబులుఁ గట్టిపెట్టియు నహింసానంద సామ్రాజ్యపుం
గోటన్ బట్టముఁ గట్టికొమ్ము జగముల్ గొండాడఁగన్ మర్త్యుఁడా!

తే-గీ॥ భువన సామ్రాజ్య పదవినిఁ బొందుకొఱకు
నీచమైన దురాశా పిశాచమునకు
నెన్ని మానవ శిరము లర్పింతువొక్కొ!
యెంత వేడినెత్తురును ద్రావింతువొక్కొ!

తే-గీ॥ విరివిగానీవు దేశాభివృద్ధికొఱకుఁ
బదిలపరచిన పరమాణు వస్తువితతి
దేశ పతనానికే దారిఁ దీయుచుండె
నేల? నీదు ప్రియత్నంబు లింక నరుఁడ!

చ॥ హృదయము నీకొకింతఁగల దేనియొనర్తువె? యిట్టిక్రూరతా
స్పదమగు నట్టి కార్యమును; భావినిఁ గల్గగ నున్న యుద్ధ నీ
రదపటలంబు గ్రక్కుకొను రక్తపు టేఱులఁ దొప్పదోగుచున్
బొదలి హసింపవే? మనుజ మూర్ధన్యములున్ నినుఁ జూచి
మర్త్యుడా!

ఉ॥ ఏచిన సౌఖ్యడోలలను యేలలనూగుచుఁ బచ్చపచ్చగాఁ
బూచిన నిండు వృక్షతతి పోలికనొప్పు ప్రపంచమున్ దురా
శా చకితుండవై రణపిశాచికి బోనము పెట్టఁగోరు నీ
నీచపుఁ గృత్యముల్ దలఁచి నీరగుచుండెను లోకమంత
యున్.

ఉ॥ జిత్తులమారివై నరుల జీవములన్ హరియించు చున్న నీ
కత్తుల కోఁతకున్ గరడుఁ గట్టిన నెత్తుటి చుక్కబొట్టుతో
మిత్తి నటించుచున్నది సుమీ! ప్రళయంబును గౌగిలించి నీ
సత్తువ నెల్ల విశ్వపుట శాంతికినై బలిఁ బెట్టఁబోకుమా!

## తె లుఁ గు శి ల్పి

ఉ॥ కొండల కోనలందొలచి కోమల విగ్రహముల్ సృజించి క
న్పండువు సేయు నేరుపు నఖండముగాఁ గలదయ్య! నీకు,నీ
పాండితి తెల్గుతల్లి కొక బంగరు భూషణమై రహించె ను
ద్దండ శిలాకలాపములు తావక కీర్తికి వజ్రహారముల్.

ఉ॥ పుట్టిన మాసిపోవఁగల ముగ్ధమనోహర భావముల్ శిలా
ఘట్టములందుఁ జెక్కి కలకాలము శిల్పకళా జగత్తువన్
బట్టముఁ గట్టికొంటివి యపార చమత్కృతి వార్ధి! శిల్పి సా
మ్రాట్టు! నమస్కృతమ్ముఁ గొనుమా! చిరకీర్తి కిరీటధారివై.

సీ॥ వాడిపోలేదింకఁ బ్రావీణ్య మొలికించి
నీవు చెక్కిననాటి తీవె గుంపు
మాసిపోలేదు బొమ్మల నెమ్మొగములపై
నీవు రచించిన భావగరిమ
తగ్గిపోలేదు నిద్దపుఁ బాలరాలపై
నీవు చిల్కిన కళా శ్రీవిభవము
చెదరిపోలేదింక చిత్రాలపైన నీ
వద్దిన రంగుల ముద్దు నిగ్గు
తే-గీ॥ కాలసాగర గంభీర గర్భమందుఁ
గలసిపోలేదు నీనేర్పు పొలుపుఁదనము
యెన్ని యబ్దముల్ గడచిపోయిననుగాని
శిల్పి మార్తాండ! నీవు శాశ్వతుఁడవోయి!.

మ॥ వలపుం జెల్వముఁ జిల్కరించి శిలకుఙ బ్రాణంబులఙ
వోయు నీ
యులిలో నున్నది విశ్వ సృష్టి రచనోద్యోగ ప్రవీణత్వ మ
న్యులకి నేరుపు కూరుపుంగలదా? లేదో? సంశయంబే
యశ
స్కళితా! శిల్పకళా విశారద! నమస్కారంబు నీప్రజ్ఞకున్.

## కర్షకుఁడు

ఉ॥ ఎండల వానలందు శ్రమియించి హలంబును బట్టి దున్నగాఁ
బండిన పంట నెల్ల ధనవంతులగాదెల నింపి యాకటన్
మండెడు నీదు పొట్ట కశనంబు యొకింత లభింపదయ్యె నా
గుండె ద్రవించిపోయినది కూటికి దేవెడు నిన్నుఁ జూచినన్.

మ॥ పొలముల్ దున్ని తనూకవోష్ణ రుధిరంబుల్ గార్చి ముత్యాల పం
టలఁ బండింతువు దైన్య మాస్యముల నాట్యంబాడఁగా నాలు బి
డ్డలు పేరాకట స్రుక్కిపోయినను జూడంబోక నెల్లప్పుడ
న్యుల కన్నంబిడి ప్రాణముల్ నిలిపెదో హా! కర్షక గ్రామణీ!

సీ॥ పండు నిప్పులవంటి మండు టెండలలోనఁ
గరఁగిపోయినది నీ కండ పుష్టి
ధనికవర్గంబుల ఋణ పిశాచమునకు
బలియైన దకట! నీ భాగ్యరేఖ
స్వేద జలంబు గావించుక భూదేవి
త్రాగెను నీదేహ రక్తమెల్లఁ
బ్రబల పరోపకారమునకై నట్టేటఁ
గలసె నీ యాలు బిడ్డల సుఖంబు

తే-గీ॥ ప్రజల యానంద సౌభాగ్య భవనమునకు
నీదు బాహుబలంబు పునాది జేసి

కుడువ కూడును మైకట్టు గుడ్డలేక
బ్రతుకుచున్నావు పేద కర్షకకుమార !

తే-గీ॥ ఉర్వి పొరలందు మరుగయి యున్నఫలము
హాల ముఖంబును మోపించి వెలికిఁదీసి
పంచిపెట్టెద వఖిల ప్రపంచమునకు
సాటియెవ్వరు నీకు కర్షకకుమార!

ఉ॥ నీ రుధిర ప్రవాహమున నేల ఫలించు ఫలంబు దోచు కొ
న్నారు; నినుర్ భయంకర ఋణంబున కాహుతిఁజేసి
దాచు కొ
న్నారు,ధనంబు, నీ కడుపునన్ క్షుధ నిప్పురగిల్చి మెక్కుచు
న్నారు పసిండికంచముల నవ్య సుధామధురాన్నరాసులన్ .

తే-గీ॥ నిన్ను పీడించి బ్రతుకు ధనికుల యింట
కలిమి జవరాలు నవ్వులుఁ జిలుకరింప
లేబవళ్ళు కష్టించు నీ గృహమునందు
నినుపగజ్జల తల్లి నర్తించుటేమి?

సీ॥ దరిలేని నిరుపేద తనపు కష్టాలు నీ
కంటిపాపలలోనఁ గానుపించు
భువనసంరక్షణా భ్యుదయ భారంబు నీ
రక్తనాళములందుఁ బ్రతిఫలించు
ననిశంబు ఘోర క్షుధానల జ్వాల నీ
పరిత్యంగ కమునందుఁ బ్రజ్వలించు
క్షేత్రమున్ బులకింపఁ జేయు యత్నమ్ము నీ
నరనరమ్ములలోనఁ బరుగులెత్తు

తే-గీ॥ స్వార్థరహితుఁడవై దేహసారమెల్లఁ
జేర్చిఁ బరుల సౌఖ్యమునకై పిండి పోసి.
సత్వమింకిన యస్థి పంజరముతోడ
బ్రతికియున్నావు పేద కర్షకకుమార !

తే-గీ॥ పచ్చ పచ్చని యీనాటి పంటభూమిఁ
ద్రవ్విచూచినఁ గలదు నీతాతతండ్రి
యెమ్మకల పొడి వారి రక్తమ్ముఁ గ్రోలి
పదను విడలేదు నేటికీ పంటపొలము.



★ సావిత్రి ★

తే-గీ॥ పదియునాఱేండ్లు నిండని పడుచుకన్య
వత్త మామలు గ్రుడ్డివారడవిలోనఁ
గాపురము, జీవితమ్మెట్లుఁ గడపినావో?
అద్భుతము తల్లి ! నీదు వృత్తాంతమెల్ల.

తే-గీ॥ మహితమైన పాతివ్రత్య మహిమచేత
దండధరునకు గుండె దద్దరిలఁజేసి
పతిని బ్రతికించుకొన్నట్టి భవ్యశీల
వమ్మ ! సావిత్రి ! వినుతి శతమ్మునీకు.

ఉ॥ పచ్చని కాపురమ్మునఁ గృపారహితాత్మకుఁడై యముండు కా
ర్చిచ్చిడినాడు నీమగని జీవము దొంగవలెన్ హరించి, నీ
సచ్చరితంబు పండినది చచ్చిన భర్త సజీవుడయ్యె గో
ర్వెచ్చని పూలవాన గురిపించిరి వేల్పులు నీశిరంబునన్.

తే-గీ॥ నీవుకోరిన యంత మన్నించి యముఁడు
కొంగునిండ వరంబులు గుప్పినాఁడు
యత్తమామల యంధత్వ మంతరించె
తల్లిదండ్రులు పుత్ర సంతతినిఁ గనిరి.

ఉ॥ ఎన్నికఁగన్న యశ్వపతి కింపులకూతురువైజనించి య
భ్యున్నతమా సతీత్వమున పుట్టినయింటికి మెట్టినింటికిన్
వన్నెలు దిద్ది నావు మృత భర్తకు జీవము వోసి పూర్వపుం
బున్నెపుటాంధ్ర కెల్ల మణిపూసవుగా సుతిఁగాంచినావ
హో !

మ॥ అనసూయాది మహాపతివ్రతల కావంతేనియున్ దీసి పో
వని విఖ్యాత సతీశిరోమణివి భవ్యస్వాంత ! నీవంటి స
ద్వనితా రత్నము లుద్భవిల్లుటను గాదా? రత్నగర్భాఖ్యయై
తనరెన్ భారతభూమి యంచితచరిత్రా! నీకుజోహారువుల్.

తే-గీ॥ భారతీయుల హృదయ దర్పణములందు
నేటికినిఁ బ్రతిబింబించు నీచరిత్రఁ
గూర్మితో భారతాంబిక కొప్పునందుఁ
దాల్చుకొన్నది మల్లెపూదండవోలె.

## —( ఉషస్సు )—

ఉ॥ కాలపుఁ జిత్రకారుఁడు నొకానొక బంగరుకుంచెతోను షో
బాలిక చెక్కుటద్దములపై నవకుంకుమ రాగరేఖగా

జాలము వ్రాయుచుండెను నిశాసతి కౌగిటినుండిలోకముల్
మేలుకొనెన్ గొలఁకుల సుమించెను దామర పూలదోట
లున్.

తే-గీ॥ తరచు చీకటి పరదాల మరుగునందు
దాచఁ బడియున్న ప్రకృతి సౌందర్యలక్ష్మి
పసుపుకుంకుమ రంగుల ముసుఁగుతో
బయలుపడియెనుగన్నుల పండువగుచు.

తే-గీ॥ కమ్మపూదేనెఁ ద్రావి మైకమ్ముతోడఁ
దమ్మిపూవుల కారాగృమ్ముల దుర్గ
గట్టువడ్డ తుమ్మెద బంది కాండ్రు
వెలలుచుండెను రేకు తల్పులను దెరచి.

ఉ॥ తూరుపుఁగొండ నెత్తములఁ దోచె సహస్రకరాలువిప్పి బా
లారుణుఁడంధకార నిచయంబును మాపుచు, కౌగిలింతలన్
గూరుకుచున్న యట్టియొల కూనలఁ బ్రక్కనుడించి పక్షులిం
పారుగళమ్మునన్ గలరవావళితో వినుతించె దైవమున్॥

—( పెద్దన )—

ఉ॥ హద్దులు దాటు నేర్పు చెలువార ప్రబంధవిధానకర్తవై
ముద్దులతెల్గుకైతకు నపూర్వ మనోజ్ఞ కళావిలాసముల్
దిద్దితివంట నాటి కవిధీరులు నబ్బురమందిచూడ నో
పెద్దన సత్కవీంద్ర! కనుపింపరికన్ నినుబోలు పండితుల్.

ఉ॥ రంగదనూనభావ సువిరాజితమై మకరందమాధురుల్
పొంగులువారు నీకవన పుంజిగిమెచ్చుచు నీపదాబ్జమున్
బంగరు గండపెండెరమునన్ గయిసేసెను కృష్ణరాయలు
పొంగెడు గుండెతోడక విభూషణ! యోకవితాపితామహా!

ఉ॥ కూరిమిమీర రాయలొనఁగూర్చిన చక్కని మందిరమ్ము,నో
రూరు రసాన్నభోజనము,నూయెల మంచము,కమ్మతావి క
ర్పూరపుఁ దమ్మలమ్ము మనమున్ దనియింపగ వ్రాసినావు బం
గారు కలమ్ముతోడ మనుగాథను నిగ్గులుపోతవోయుచున్.

తే-గీ॥ నీవు కవనపుఁ జలువపన్నీరుఁ జిలికి
పేర్మిఁ బోషింపగా నభివృద్ధిఁగన్న
కృష్ణరాయలవారి సత్కీర్తివల్లి
పూచి వలపించినది దిక్సమూహములను

# వీ ర స మా ధి

(ఒక హిందీ గేయము ననుసరించి కొన్ని మార్పులతో)

చ॥ ఇదిమన ఝాన్సిరాణి శయనించిన వీరసమాధి దీనిలోఁ
బొదలుచునున్న దిప్పటి కపూర్వవికస్వరమై స్వతంత్రతా
భ్యుదిత మనోజ్ఞదీపరుచి పుంజము ఝానిసి లక్ష్మిబాయి కి
య్యది ముదిపంబుఁగూరిచిన యంతిమ కేళికళాప్రదేశముల్

తే-గీ॥ ధైర్యభావంబు విడక నంతంబుదాక
వీరబాలయై రణమున దూరిపోరి
ఝానిసీలక్ష్మి పావక జ్వాలవోలె
క్షితిని వెలిగించి చితినధిష్ఠించెనిచట.

తే-గీ॥ దేశమాతృ పరాధీన దీన వృత్తిఁ
బాపుటకు లేత చేతఁ గృపాణమూని
కదనరంగాన బలిసైన కారణమున
భారతీయుల కిది పూజ్య పదవియయ్యె.

తే-గీ॥ ఈపవిత్ర సమాధిగా ధాపదముల
జాలి గుండెతో సత్కవీశ్వరులవాణి
పాడుకొనుచుండు వెన్నెల బయలులందు
కమ్మకమ్మని భావగీతమ్ములల్లి.

ఉ॥ భారత మాతృకా చిరతపః ఫలపుంజము ఆయువ్రాడి క
న్గారికినట్టి చోటిది యకుంఠితశౌర్య పటుత్వమెల్లనా
కారముఁ బూని మన్ననలఁ గాంచిగతించిన సీమయిద్దియో
భారత పుత్రులార! తలవాలిచి మ్రొక్కుడు యీసమాధికిన్.

ఉ॥ పూనిక మోసపు బనులఁ బుక్కటబట్టు పరప్రభుత్వ దా
వానల కీలలందసువులాహుతిఁ జేసిన వీరలక్ష్మి! యో
ఝాన్సిరాణి! యుజ్వలయశస్సుధారిణి! యోస్వతంత్రతా
మానస! నీకు భక్తి కుసుమాంజలి పుణ్యసమాధిరూపిణీ!.



## బాలచంద్రుఁడు

చ॥ చిదిమిన పాలుగారు నునుచెక్కుల లేతని నిగ్గులేనియున్
వదలని ప్రాయపుంజిలుత పాపఁడవై భయమింతలేక యు
న్నదన మొనర్చి వీరమరణంబును గాంచిన నీదుశౌర్య సం
పదకు నమస్కరించెఁ బ్రతిపక్ష బలంబులు బాలచంద్రమా!

గీ॥ శిరము ముద్దాడి తల్లి యాశీర్వదించి
పంపఁ జిగురు కెంగేలఁ గృపాణమూని
కదన కల్యాణ మంట పాంగణమునందు
వీరలక్ష్మిని బాలుఁడు పెండ్లియాడె.

ఉ॥ కందిన వాడి ఖడ్గముల గాయపు చిల్లులనుండి నెత్తురుల్
జింది దొరంగినన్ సరకు సేయక శత్రుశిరంబుఁ గత్తిఁ గొ
నం దగిలించి తెచ్చి జతనంబుగ తండ్రికిఁ జూపినావు నీ
కుందగు వీరుఁడీ తెలుఁగు కుంభినిపై మఱలన్ జనించునే?

ఉ॥ దాయల గుండెలన్ వెఱపు దయ్యము పిల్లలు సేయ నీమహో
గ్రాయత ఖడ్గధార రణమందున రక్తవసంతమాడె లేఁ
బ్రాయపు వీర! నీమృదుల బాహుబలమ్మఖిలమ్ము నీదు దీ
ర్ఘాయువు నాహరించి నది యక్కట! నాయకురాలు
మృత్యువై.

చ॥ నవనవలాడు బాల్యతరుణమ్మున కమ్మని యుగ్గుఁ బాలతోఁ
జవిఁగొనినావు శౌర్య రుచి, సంగర రంగకళా ప్రవీణతన్
శ్రవణ మహోత్సవంబుగ వినంబడు మాపల నాటనేటికిన్
బ్రవిమలమైన తావక పరాక్రమ దివ్య కథాకలాపముల్.

తే-గీ॥ నీదు వీరవృత్తాంతమున్ విననయంత
బడుగు ముసలయ్యకును నెత్తురుడుకు లెత్తు
బాలచంద్రమా! నీచిత్ర వచ్చరిత్ర
తెలుఁగుతల్లికి ముత్యాల తిలకమయ్యె.

తే-గీ॥ ఘనతరంబైన నీపరాక్రమము కతన
భాషకందని యాంధ్రుల పౌరుషంబు
కల్లగాదని జగతికిఁ దెల్లమయ్యె
పరబలమదేభపంచాస్య! బాలచంద్ర!

# ఇంద్రధనుస్సు

గీ॥ తాండవంబొనరించు సందర్భమందు
చెలువుఁ గులికించు నెమిలి పింఛెంబువోలె
నేడురంగుల శోభతో హృద్యమగుచు
నెసఁగుచున్నది గగనాన నింద్రధనువు.

గీ॥ మొలకపచ్చలు కుప్పగాఁ బోసినట్లు
పసిమి బంగారమును జోడు పరచినట్లు
లేగులాబివన్నెలను గీలించినట్లు
సాంద్రముగ వెల్గుచున్నది యింద్రధనువు.

గీ॥ కుంచెఁ గొని రంగులెల్లను గుదురుపరచి
వ్రాయునే? చిత్రకరుఁడిట్టి వర్ణనమును
దైవనిర్మితమైన సౌందర్యమునకు
సాటివచ్చునె? నరుల ప్రజ్ఞాబలమ్ము.

గీ॥ అఖిలమును సృష్టిసేయు విశ్వాధిపతికిఁ
గాలపురుషుఁడు వట్టు శృంగారగరిమఁ
గులుకు నవరత్నములమేలి గొడుగనంగ
నెడఁదపులకింప విలసిల్లె నింద్రధనువు.

గీ॥ రంగురంగుల యీసుందరంపు ధనువు
నేమహాశిల్పి యింటఁ జిత్రించినాఁడొ?
తెలుసుకొనువాఁడు లేఁడిలఁ దెలియఁజెప్ప
వాఁడు లేఁడిది వర్ణింప వశముగాదు.



# వనవాసము

గీ॥ తండ్రియానతి పూవుల దండవోలె
శిరమున ధరించి సౌమిత్రి సీతతోడఁ
బదియునాల్గేండ్లు వనములో మొదలుకొఱకుఁ
బోవుచున్నాఁడు శ్రీరామ భూవిభుండు.

సీ॥ పంచభక్ష్యాన్నాలఁ బరితృప్తిఁగనుసీవు
భుజియింతువా? కందమూలములను
పట్టుపాన్పులలోనఁ బవ్వళించెడుసీవు
శయనింతువా? శిలాఖండములందు
మేలైన జిలుఁగు వస్త్రాలుఁ దాల్చెడుసీవు
కట్టుకొందువ? నార పుట్టములను
సామ్రాజ్య విభవ రక్షణ మొనర్చెడు సీవు
శాసింతువా? జంతు సంతతులను

గీ॥ చక్రవర్తికిఁ బ్రియతనూజన్ముఁడువయి
రాజ్యభోగమ్ములను దృణ ప్రాయముగను
విడచి తాపస వేషంబు స్వీకరించి
పయనమైతివా? నాతండ్రి! వనముఁజేర.

ఉ॥ నోములునోచి ముద్దుల తనూజునినిన్ గనిపెంచి నేడు "మా
రాముని చిట్టితండ్రిని నరణ్యనివాసిగఁ జేసిపంపుచు
న్నా"మని దీనులౌచు నయనంబుల బాష్పములూ ఱు
దుఃఖ బా
ధామతులైన నీదు తలిదండ్రుల కూఱటగల్గు టెట్టులో?.

శా॥ ఈడుంజోడును లేని శూరుఁడు, భుజంగేశావతారుండు, నీ
తోడఁబుట్టువు, లక్ష్మణుండునిదె నీతోఁగూడ నేతెంచుచు
న్నాఁడయ్యా! వనమందు నీకు నిసుమంతన్ బాధ రానీకఁగా
పాడున్ భక్తుఁడతండు నీకు నిక లోపంబుండునే? రాఘవా!

శా॥ విల్లమ్ముల్ ధరియించి లక్ష్మణుఁడు తావెన్వెంట రాజానకీ
ఫుల్లాబ్జాక్షినిఁగూడి ప్రేమ హృదయంపుం దండ్రియాదేశ
మున్
జెల్లింపన్ జనుచున్నవాఁడు మఱలన్ శ్రీరామునిన్ గాంచుటె
న్నాళ్ళుంబట్టునొ? యంచు పౌరులుకలంతన్ జెందుచున్నా
రెదన్.

ఉ॥ మొన్ననె పెండ్లియాడితివి పుణ్యచరిత్రుని రామచంద్రునిన్
గన్నియ వాలకమ్ము సరిగావిడలేదుగదా! వయస్సులోఁ
జిన్నవు సౌఖ్యమేమనుభవించితివమ్మరొ! యెందఱెంతవ
ద్దన్నను గానకుం బయనమైతివి భర్తృపదార్చనారతిన్.

మ॥ జనకక్ష్మాపతికిన్ బ్రియాత్మజవు, కౌసల్యామహాదేవికిం
పును జేకూర్చెడు పెద్దకోడలవు, నఁభోజేక్షణుండైన రా
మునికిం బట్టపురాణివెల్ల సుఖముల్ బోనాడియేతీరుగా
వనవాసంబొనరింతువో? జనకజా! పద్నాలుగేండ్లొక్కటన్.

మ॥ చెలికత్తెల్ నిరతంబుఁ జుట్టుఁగొలువన్ శ్రీదేవిచందాన ని
స్తులమౌపూవుటుయేలపానుపులలో దోగాడుచున్ నిండువె
న్నెల రేనిన్ దులకించు మానికపు రాణీవాసముల్ వీడియె
ట్టులఁ గావింతువో? కాననలందునికిపట్టుల్ తల్లి! సీతాసతీ!

చ॥ వదినెయునన్న గారు వనవాసముసేయుట నాలకించియున్
గదలితివా? శరగ్రథిత కార్ముక హస్తుఁడవై పురోగతిన్
బదిలముసుమ్మి! వారిమృదుపాదములన్ ములునాటకుండగా
మెళకువ రాతిరింబవలు మేలుకతో వనమందులక్ష్మణా!

సీ॥ కొమ్మలు నాకులుఁ గొనితెచ్చి చల్లని
పర్ణకుటీర మేర్పరుపుమయ్య!
దొరగాఁబండి మధురమైన ఫలముల
నర్పించియాకలి దీర్పుమయ్య!
పవళించుటకు నవ్య పల్లవమ్ములతోడ
మెత్తనిశయ్య నిర్మింపుమయ్య!
నేత్రముల్ ముకుళించి నిద్రఁబోయెడువేళఁ
జక్కగా రక్షణ సలుపుమయ్య!

గీ॥ కష్టమొక్కించుకేనియుఁ గలుగకుండ
జానకీరాములకు స్వచ్ఛమైనభక్తి
సేవలొనరించి యిహపర శ్రీలుఁగొనుము
లక్ష్మణకుమార! యో అకళంకహృదయ!

ఉ॥ కన్నులనీరుజాలుఁగొన గద్గదికమ్మగు యెల్గుతోడనా
కన్నకొమార! వంశతిలకా! జలదామల నీలదేహ! క్రొం
బున్నెపుపంట! దివ్యగుణభూషణ! యంచుననుంగుతల్లి భ
క్తి న్నతుఁడైన రాఘవునిఁ దేల్చెను ప్రేమపుటాశిషంబులన్,

ఉ॥ తల్లుల కెల్ల మ్రొక్కి కనతండ్రికి నంజలిఁ జేసి స్మేహాసం
ఫుల్లమనస్సుతోడ వలపుం జెలికాండ్రను వెచ్చనైన కౌఁ
గిళ్ళ నమర్చి బంధువులఁ బ్రేఁగనుచూపుల నాదరించి మే
ల్బల్లని భూసురాశిషములన్ గొని రాఘవుఁ డెక్కె తేరునన్.

గీ॥ రాఘవా! మిమ్ము కొంత దూరమ్ము వఱకు
సాగనంప సుమంతుండు సత్వరమున
గుఱ్ఱములఁ బూన్చి పగ్గముల్ గుంజిపట్టి
బంగరురథంబు నాయత్తపరచినాఁడు.



## స్వా గ త ము

ఈ పద్యములు సిద్దిపేట ఆంధ్ర సారస్వత పరిషత్ శాఖా పక్షమున జరిగిన స్నాతకోత్సవ సందర్భమున చదువబడినవి.

గీ॥ మాతృభాషపైనున్న ప్రేమంబుతోడ
నన్యభాషా విమోహ మనాదరించి
విజయులైనట్టి విజ్ఞాన వేత్తలార!
స్వాగతము మీకు ఆంధ్ర విద్యార్థులార!

సీ॥ ప్రథమంబునందు నాంధ్ర కవిత్వసృష్టికి
నన్నయ్యకలమందు కొన్ననాఁడు
పదునైదుపర్వాల భారత కావ్యానఁ
దిక్కన్న నేర్పులు దిద్దునాఁడు
రెడ్డిరాజులదొడ్డ యొడ్డోలగంబుల
శ్రీనాథు వాణి రంజిల్లునాఁడు

నిండారు బంగారు గండపెండేరములోఁ
బెద్దన్న పదము శోభిల్లునాఁడు
గీ॥ భారతీదేవి కెమ్మోవి పగడమందు
నంకురించిన నవమందహాసలవము
నేటి శుభవేళ మఱలఁ గన్పించునేమొ ?
అమలగుణులార ఆంధ్ర విద్యార్థులార!

సీ॥ పోతన కవి హాలమ్ము కలమ్ముచేతఁ గీ
లించి సేద్యంబు సాగించునాఁడు
కృష్ణరాయలవారి కీర్తి రంగము నెక్కి
యాంధ్రభారతి నాట్యమాడునాఁడు
దేశభాషలయందుఁ దెలుఁగులెస్సనుమాట
దిగ్దిగంతముల శబ్దించునాఁడు
మధుర భూపతులు సమ్మతిగ నాహ్వానించి
తెల్గుకైతకు వన్నెఁదెచ్చునాఁడు
గీ॥ కాకతీయులముక్తాపతాకనీడఁ
గోవిదులు పైఁడి పండించుకొన్ననాఁడు
అమలుజరిగిన స్వర్ణ ఘట్టములుతిరిగి
యరుగుదెంచునో ? యేమొ ? విద్యార్థులార!

సీ॥ చిరకాలముగ నిరీక్షించుచున్నట్టి
యాంధ్రరాష్ట్రము వచ్చు నంతవరకు
సౌఖ్యప్రదముగ సస్యశ్యామలమ్మ్మలై
యాంధ్రసీమలు పెంపు నందువరకు

తెలుచాపలెత్తి మత్తిలితూర్పు సంద్రాన
నాంధ్రనౌకలు నీదులాడువరకు
శాంతి సందేశముల్ జగతికిఁ జాటింప
నాంధ్ర ధ్వజములు మిన్నంటువరకు
గీ॥ పూలుపూచి పరిమళమ్ములు వెలార్చి
యాంధ్ర భాషాలతజగాన నలరువరకుఁ
గూర్కు కంటికి రాదని ఘోరమైన
దీక్షఁగొని నిరంతరము యత్నింపుడయ్యా!



## స్వార్థ పరుఁ డు

ఉ॥ అంగములెల్లఁ బిండియగునట్లు శ్రమించుచు నీకు శ్రీపరి
ష్వంగ సుఖమ్ముఁగూర్చి యుపవాసకృశోదరమూర్తు లౌచునీ
ముంగలఁ గొంగుఁజాపుకొని భోజన భిక్షకు వేచినారుకూ
ర్మింగరుణింపు మార్తుల గరీబులలోకము మెచ్చ సోదరా!

గీ॥ మోసగాఁడవై పేదల పొట్టఁగొట్టి
నింపుకొన్నావు పెట్టెలనిండ ధనము
బీదల సుఖంబునెల్లఁ బునాదిఁజేసి
కట్టుకొన్నావు బంగారు కుట్టిమంబు.

గీ॥ తోడి సోదరుల్ కుడువఁగ కూడులేక
పూరిగుడిసెలలోనఁ గాపురముసేయ
అమృత భోజన సంతుష్టినందుకొనుచు
సౌధములలో వసింతువే? స్వార్థపరుఁడ!

శా॥ నీలో మానవతాలవంబుఁ గలదేనీ ?. తోడివారీవిధం
బాలుంబిడ్డలతోడఁ బట్టణబహిః ప్రాంతమ్ములందన్న పా
నాలుఁ లేకఁ గృశింతురే ? ధన పుత్ర్యష్ణాబుద్ధినిఁ వీడి వే
మాలోకంబున బీదవారిని పరామర్శింపుమా ! సోదరా !



## బాష్పాంజలి

మ॥ ఎటులన్ బోయితి? వెట్టిపుణ్యపదమందీవిప్డుడున్నావొ?చీ
కటులుఁ గ్రమ్మె ఘనమ్ము నీమరణ మాకర్ణించి యాంధ్రా
వనిఁ
స్ఫటిక స్వచ్ఛయశస్క!యో తెలుఁగుభాషా లోకమార్తాండ!
వెం
కటశాస్త్రి! నినువంటి సత్కవివరుఁ గన్గొందుమే ? యింక
ముఁ.
మ॥ తెనుఁగుంగడ్డయుదంబుధిఁ మునిగి శాస్త్రి! నిన్ను కీర్తింప
మొ
న్న నె యాస్థానకవిప్రదాన బహుమాన మ్మొందినావింతలో
న నె యొల్లేగితివయ్య ! నీమధురసన్మానోత్సవంబుంగనఁ
గనులుఁ గట్టినవేమొ? బ్రహ్మకు నినుఁ గావించెస్వర్గస్థునిఁ
సీ॥ లేతనవ్వుల నాంధ్ర మాతదీవింపఁగా
నేనుఁగు లెక్కి యూరేఁగినావు
అష్టావధాన శతావధానములతో
ఖ్యాతిని యుత్తలూఁగించినావు

గరువంబుతోడ దిగ్గజములవంటి పం
డితుల వాదమున నోడించినావు
కనకాభిషేకాది గౌరవములుఁ గాంచి
పులకించి యుబ్బి యుప్పొంగినావు
గీ॥ నేఁడు రత్నాలవోలె రాణించుచున్న
శిష్యవర్యులను దయారుఁజేసినావు
శారదాదేవి యపరావతారమనగ
యశముఁగైకొని బ్రహ్మైక్యమందినావు
అట్టి నీకు బాష్పాంజలు లమరసుకవి!

ఉ॥ పలుకులరాణి పాణిఁగల బంగరువీణియ యేయపశ్రుతుల్
బలికెనొ? నిన్నువంటి కవివర్యుని మాకెడబాటొనర్చు
చున్
బిలుచుకపోయి స్వర్గపద పీస్థితుఁజేసెను మృత్యువక్కటా!
కలకలలాడు ఆంధ్రుల ముఖమ్ములఁ దోఁచె విషాదచిహ్న
ముల్

ఉ॥ పారములేని నీకవన పాండితికిన్ మది మెచ్చుచున్ జమీం
దారులుసేయుచున్ననలఁ దద్దయు మోదము నొందినీవునూ
రూరుఁజరించి యీతెలుఁగు టుర్విని స్థాపనఁజేసి చన్న నీ
కీరితి మల్లెతోట పులకించి హసించెఁ బరీమళమ్ములన్.

మ॥ కవితా పాండితిలో బృహస్పతికి వాగ్బంధమ్ము గావింతువే?
దివిజుల్ సన్నుతిసేయ వేల్పుదొర సొంతేవేయి నేత్రాలమ

క్కావ నప్రబంబును నించుచుక్ బులకితాంగుండైవిలో
కింపఁగా
నవధానమ్ము లొనర్తువే? కవివతంసా! స్వర్గలోకమ్మునన్.
ఉ॥ వాణిహసింప మొన్న బెజవాడ పురమ్మున నీయఖండ స
న్మాన మహోత్సవమ్మునకు నవ్యజలమ్ము లొసంగినట్టి కృ
ష్ణా నది నేఁడు తీరని విషాదపయోనిధి ముగ్గి నీమృతి
స్నానమొనర్చెఁ గింకఁగజాంకుశ! యింతట నింతమారు
పా?
చ॥ తనరఁగ నీవు తెల్గు కవితా వనవాటికలోన నాటి పో
యిన నవబీజముల్ మొలకలెత్తి చిగిర్చి ఫలించి యాంధ్రభా
షను నలరించెఁ దత్తరువు చల్లని నీడల నిల్చి నేటి యీ
తెనుఁగు కవీంద్రకోటి గడిదేఱును కైతకవాతుచేతలన్.
తే-గీ॥ వనటఁగూర్చిన నీనిర్గమనము కతన
తెలుఁగు దేశానఁ జీకటి తెరలు గ్రమ్మె
మధురమైనట్టి నీయాగమనము కతన
ముదముమీర స్వర్గంబునఁ బ్రొద్దుఁబొడచె.
సీ॥ నీవు లేకను శూన్యమై విన్నఁబోవుచు
బావురుమనియె నీభవన లక్ష్మి
వలపూరు నీదు సంభాషణలుదలంచి
వాపోవుచుండె నీబంధుకోటి
బాష్పోదకముల తర్పణలిచ్చుచున్నారు
సిలుఁగుతో నీకూర్మి శిష్యవరులు
జోటజోట వెడలు నల్లటిసిరా కన్నీరుఁ
జిమ్ముచున్నది నీదు చేతికలము

గీ॥ శోకముద్రిత ముఖముతో నీకుటుంబ
మలమటించుచునున్నది యనవరతము
నాంధ్రదేశమ్మునందుఁ బ్రత్యణువు నేఁడు
స్నపితమగుచుండె నుష్ణాశ్రు జలములోన.

శా॥ నీకంఠస్వరమింక మా చెవులకున్ విన్పించునే? నీపవి
త్రాకారమ్మికఁ జూడ జాలుదుమె? నేత్రానందపూర్ణంబు గన్
నాకశ్రీసుఖ డోలికావళులలోనన్ దేలు విద్వన్మణీ!
శైకొమ్మా చెళపిళ్ళ వెంకటకవీ! కన్నీటిపూజాంజలుల్.

శా॥ అంతుఁబొంతునులేని కూర్మిచెలికాఁడై తోడివిద్యార్థియై
యంతేవాసియునై మెలంగు తిరుపతశాస్త్ర్యఖ్యుండు ప్రాజ్ఞుండెదన్
సంతోషించెనె? మొన్నఁగల్గిన భవత్సన్మాన సౌభాగ్యవృ
త్తాంతమ్మున్ విని స్వర్గమందుఁ గవిచంద్రా! వెంకటేశాగ్రణీ.

# ఆంధ్ర వైభవము

సీ॥ తోలకలేదింక దిక్కుల జయస్తంభముల్
నాటివచ్చిన తెల్గు పోటుఁదనము
చవిఁదగ్గలేదు భాషలకెల్ల మిన్నయై
కులికింప నేర్చిన తెలుఁగుపలుకు
మాయలేదింక సమస్త దేశాలను
వలపించివచ్చిన తెలుఁగుకీర్తి
పదనాఱలేదింకఁ బగవారి నెత్తుట
జలకమ్ములాడిన తెలుఁగుకత్తి

గీ॥ నవయుతేదింక భువనమంటపము బ్రాకి
ననలుఁదొడిగిన తెలుఁగు విజ్ఞానలతలు
తిరిగిచూతుము సోదరా! తెలుఁగుశోభ
నేత్రపర్వప్రదముగఁ గాన్పింపఁగలదు.

సీ॥ గడుసు ఢిల్లీషాను ఖైదిగాఁగొనితెచ్చు
మహితయుగంధర మంత్రియుక్తి
కదనాన శత్రురక్తపు వసంతములాడు
బాలచంద్రుని లేత బాహుశక్తి
అడుగ లేదనకిచ్చి యాచకశ్రేణినిఁ
దనుపు భాస్కరమంత్రి దానమహిమ
తేటమాటలను, హత్తించి ముద్దులకైత
లల్లిన వేమన్న యమృతవాణి

గీ॥ ప్రేమనిధియైన భద్రాద్రి రామవిభునిఁ
గైవసముఁజేసికొన్న విఖ్యాత భక్త
వరుఁడు కంచర్లగోపన్న భక్తిగరిమ
నప్పుడే విస్మరించితే? యాంధ్రపుత్ర!

సీ॥ అమరావతీనగరమున నాంధ్రులశిల్ప
మందచందముల నింపొందునాఁడు
దేవరాయలసభఁ దెలుఁగుపల్కులరాణి
క్రొత్తవన్నెలుదిద్దుకొన్ననాఁడు
త్యాగయ్యకంఠాన నాంధ్రసంగీతంబు
కృతిరూపమున నంకురించునాఁడు
అన్యసీమలలోన నాంధ్రులశౌర్యమ్ము
విజయధ్వజములు స్థాపించునాఁడు

గీ॥ ఇతరదేశీయు లాశ్చర్య మెలసిచూడ
తెలుఁగుభూమి వజ్రాలనెత్తించునాఁడు
పెంపుఁగాంచిన నీదేశ విభవమెల్లఁ
దెలుసుకొనవోయి! సోదరా! తిరిగిచూచి



## స రో జి నీ నా యుం డు

మ॥ పలుకుంబల్కున శౌర్యముట్టిపడ సంభాషించు వక్తృత్వము
న్నల ప్రజ్ఞావతి, వంగవంశమునకున్మాణిక్య దీపాంకురం,
బలఘు ఖ్యాతినిఁగన్న చారుకవితా వ్యాపారపారీణ, మా
తెలుఁగుంగోడలునౌసరోజిని పడంతిన్ జాలఁగొండాడెదన్

ఉ॥ ధీయుతచాతురిన్ భరతదేశ వనాంతరమందు కబ్బపుం
గోయిలపిట్టవై మధుర కూజితముల్ వెలయించినావు నీ
తీయని కైతపాటలకు దిగ్వితతుల్ పులకించిపోయెనో
నాయునిరాణి! సుందర గుణంబులరాశి! సరోజినీసతీ!

మ॥ అసియారాజ్య మహాసభాంతరమునం దధ్యక్షతాభార మ
త్యసమానమ్మగు చాతురీ గరిమ మిట్టాడన్ జలాయించివే
డ్కసుమింపం బరదేశవాసుల పొగడ్తల్ గాంచినావమ్మ! యె
ల్లెసలన్ బర్వెను నీప్రతిష్ఠ కవయిత్రీ స్వర్గలోకస్థితా!.



## ర తీ వి లా ప ము

ఉ॥ ఆయత శంభుఫాల నయనానల కీలల భస్మరాశివై
పోయెను నాథ! నీభువన మోహనరూపము, నీదుమారణా

ధ్యాయము నేఁడు నాదుహృదయంబున అంపపుఁ గోఁత యయ్యె నీ
గాయముమాన్ప నౌషధముఁ గల్గునె? యెన్నటికేనియున్ బ్రభూ !.

చ॥ చిగురువయస్సులోని మన జీవిత నాటక గాథ నేటితో
ముగిసెను ప్రేమపుంగొనబు ముగ్గులుఁదీర్చిన నాయెడందలో
రగులుచునున్న దెంతయు నిరంతర దుఃఖపు టగ్ని రాశి యీ
జగ మొక యంధకారపుఁ బిశాచి విధంబునఁ దోఁచుచుండెడిన్.

ఉ॥ చల్లని చంద్రమఃకళను స్వర్ణదినిన్ దలపైనఁ దాల్చి రం
జిల్లెడు శంకరుం డెటులఁ జిమ్మెను? నీపయి కంటిమంటలన్
వల్లభ! తావక ప్రణయనాదము మ్రోఁగినయట్టి నామనో
వల్లకి పల్కుచున్నది విపన్న విషాద రసార్ద్రగీతముల్.

ఆ-వె॥ పతివిహీనమైన సతి జీవనంబు వా
ర్ధిని తుఫాను దెబ్బఁ దిన్న నౌక
పసుపు కుంకుమలకుఁ బాసిన వైధవ్య
జీవితంబు నోర్చు టేవిధంబు?

మ॥ చెలువంబున్ జిలికించి మోదమిడు నాశృంగార సౌభాగ్యముల్.
బలియైపోయెను నేటిరోజున మహా వైధవ్య భూతానికిన్
దలిరుంబోఁడుల భాగ్యరత్నమగు మాన్యంబైన బంగారుమం
గళసూత్రంబిక గంగలోఁ గలసె సౌఖ్యశ్రీనిఁ బోఁకార్చుచున్.

ఉ॥ ఎండుబెండారినట్లె తడి యింకిన నాహృదయాంతరంబునన్
బండగఁజాలునే? వలపుపంటలు, మిక్కిలి శోకతప్తమై
గుండెలు బండబారినవి ఘూర్ణిలుచున్నది దేహమెల్లఁ బ్ర
హ్మాండమునయ్యె జీవనపు భారముమోచుట జీవితేశ్వరా!

గీ॥ పూలబాణాలతో జగంబుల జయింపఁ
గలుగునీవిల్లు చెట్టుగుట్టలనుబట్టెఁ
జెలువుపలుకులఁ గులుకునీ చిలుకగుఱ్ఱ
మడవిపాలయ్యె నీకోస మలమటించి.

మ॥ ప్రణతార్తివ్యసనుండు శంభుని తపోభంగంబుఁ జేయింపగా
నినుఁబుత్తెంచిన వేల్పులందొకరుగానీ నేఁడు నీదుర్దశన్
గని సాహాయ్యము సేయరైరికద! ముగ్ధంబైన నాభావి జీ
వన సౌధంబు పునాదిరాల గమిలోఁ బాతాళమంటన్ బడెన్

ఉ॥ నిచ్చలు తోడునీడయయి నీప్రియమైత్రినిఁ జూరఁగొన్న నీ
నెచ్చెలికాఁడు మాధవుఁడు నీకొఱకై పరితప్తచిత్తుఁడై
విచ్చిన పూలదోసిటను వెచ్చని తేనెలతోడ తర్పణం
బిచ్చుచునున్నవాఁడు హృదయేశ్వర! యెట్టులస్వీకరింతువో!

శా॥ సింగారమ్ముల ప్రోవు నీతనువు భస్మీభూతమైనప్పుడే
భంగమ్మైచనె పార్వతీపతి తపోభాగమ్ము, లోకంబునన్
శృంగారక్రియ యంతరించినది, మత్ప్రేమప్రవాహమ్ముఁగూ
డంగోరంబుగనింకిపోయె నడుగంటన్ బుష్పబాణాసనా!

ఉ॥ అన్నులమిన్నలన్ వినుతులందిన సుందరినంచు లోకమం
దెన్నికఁగన్న నేను దురదృష్టముపాలయి పోయినాను నా
పున్నెపుఁదోటలోని లతఁబూచినపుష్పగుళుచ్ఛమా చునన్
వన్నెలుఁగుల్కు నీవెపుడు భస్మమునందితి వస్తు దేప్రభూ !

---

## తెలంగాణ కవి

ఉ॥ కానికి కోమలంబయిన కావ్యసుమంబును విక్రయించుచున్
దీన మనఃప్రవాహమునఁ దేలుచు నూటపదారులాది స
న్మాన మహోత్సవంబుల కనారత ముబ్బిళులూరు నీ తెలం
గాణ కవీంద్రు లేఖనులఁ గల్గునె? చక్కని కావ్యరత్నముల్.

సీ॥ రూకయో మఱి రెండు రూకలో యర్పించు
వాని వర్తనమెల్లఁ బ్రస్తుతించి
ఖద్దరు వస్త్రాల కాన్కలతో గౌర
వించెడు దాతలఁ బెండ్లియాడి
కాలాబ్ధిగర్భానఁ గలసిపోయిన పూర్వ
వైభవంబునకు బాష్పములు రాల్చి
పరరాష్ట్రములలోన జరుగుసత్కృతుల బ
హూకృతుల్గాంచి నిట్టూర్పుబుచ్చి
గీ॥ యొక్కచో నిల్వలేక నూరూరుఁ దిరిగి
తిరిపమెత్తుచునుండెను తెలుఁగు కవిత
గడనకెక్కిన మా తెలంగాణమందుఁ
దలఁచుకొనినంత నకట! కన్నులు చెమర్చు.

గీ|| అక్కటిక మింతలేని పెద్దమ్మకటికి
కౌఁగిలింతలఁ జిక్కిన కవికలాన
పరుగువారునె? మధుర భావస్రవంతి
తళుకులొలుకునె? మృదుల శబ్దప్రణాళి.



## తెలుఁగుపూజ

మ|| తలఁపన్ రాయలవారు బాహువున నెత్తన్ బల్లకీనెక్కి మా
తెలుఁగుంబల్కుల రాణి నూత్నరుచులుద్దీపింపగా రాజవీ
థుల నూరేగిన నాటి కమ్మని కథాస్తోమంబు భావింపుచున్
బులకించున్ దనువల్లి కన్గొలుకులందున్ నిండు మోదాశ్రు
వుల్.

మ|| తెలుగుంగావ్యపుఁ గన్నెమిన్నలకు భర్తృత్వంబునుం
బూని యు
జ్జ్వల తేజోనిధులై విరాజిలిన రాజశ్రేష్ఠు లార్జించు న
ప్పొలుపుం గీరితి కమ్మకప్పురపుఁ దావుల్ గుప్పుమంచష్టది
క్కులవాసించిన నాటి స్వర్ణయుగమున్ గొండాడెదన్
వేడ్కనై.

మ|| ఒకనాఁడాంధ్రుల భేదభావమున నత్యుత్సాహులౌ మ్లేచ్ఛవీ
ర కృపాణంబుల వాడిపోటులకు దుర్వారప్రభిన్నమ్ములై
వికృతాకారములౌచుఁ గన్పడెడు హంపీక్షేత్రశైథిల్య శి
ల్ప కళాఖండములన్ విషాదవిధి నారాధింతు కన్నీళ్ళతో.

ఉ॥ కట్టిడి కోడిపందెపుతగాద నెపంబున నాయురాలిచేఁ
బుట్టిన ఘోరమైన రణభూమిని వీరవిహార కేళికా
ఘట్టములన్ వెలార్చి మృతిఁగాంచిన బాలునిశౌర్యగాథలన్
బట్టుగ నాలపించు పలనాటి వసుంధర కంజలింతెదన్.

సీ॥ నాతెల్గుతోటలో నవ్యకావ్య సుమాలు
విరిసిదిక్కులనిండఁ బరిమళించె
నాతెల్గుపసిఁడి వీణానిక్వణమ్ములోఁ
దీయనిభక్తి గీతికలు మొరసె
నాతెల్గు మందిరాంతరమందు మేటి శి
ల్పుల కళాసంపద పూలుపూచె
నాతెల్గు గగనాంగణమున వీరుల ఖడ్గ
విద్యుల్లతారుచుల్ వెలిఁగిపోవు
గీ॥ నాతెలుంగు మనోహర నాగరికత
ఖండఖండాల కెగఁబ్రాకి తాండవించె
నాతెలుంగు సత్కీర్తి కన్యాలలామ
పుడమియెల్లను ముత్యాల గొడుగుఁబట్టె.



సంపూర్ణము.

